# అశ్వలక్షణసారము

ఇది

మనుమంచిభట్టు ప్రణీతము.



పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్య

బుక్ సెల్లరు, రాజమండ్రి.

రెండవకూర్పు 1000 ప్రతులు.

కాకినాడ.

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1929.



[వెల 1—0—0.

# పీఠిక

భాషాభిమానులారా!

ఈగ్రంథరాజమును బహువ్యయప్రయాసలకోర్చి గౌతమీ పుస్తక భాండాగారము నందలి తాటియాకు పుస్తకమునుండి యెత్తి వ్రాసితిని. అద్దానిని భైరవాచార్య పుత్రుడగు మనుమంచిభట్టను నాతడు రచించియుండెను. ఈతడు గ్రంథములో నొకచోట దాను శాలిహోత్రుడుచే మున్ను రచింపబడిన దాని నాంధ్రీకరించినట్లు జెప్పియున్నాడు. (చూ. ప్రథమాంకురము 2 పద్యము) ఈతడీగ్రంథమును సాళువకంపభూపాలునకు అంకితమొనంగెను. వీరికాలమును నిర్ణయించుటకు తగిన యాధారములు లభించుట లేదు. నాయల్పబుద్ధికి దోచినట్లుగ వివరణమును వ్రాసి స్ఫురింపలేదు. కొన్ని పద్యములు తప్పుబడి యుండునని దోచుచున్నది.

పాఠకులు నాప్రమాద జనితదోషముల మన్నించి పూర్వకవిశేఖరుడగు మనుమంచిభట్టుపై నాదరముంచి యభిమానింతురు గాక.

కాకినాడ,
9-8-17.

ఇట్లు,
మద్దూరి శ్రీరామమూర్తి.



శ్రీరస్తు.

# అశ్వలక్షణసారము.



## ప్రథమాంకురము.





శ్రీరమణీ ముఖపద్మ
స్మేరస్మితమధురసాను సేవానిపుణో
దారభ్రమరవిహార
స్వామదు కృతిపతికి నిత్య సంపదలొసఁగున్.

చ. అనఘుఁడు శాలిహోత్రుఁడు హయంబులకున్ మును జెప్పినట్టియా
యనుపమలక్షణంబులు న యాఃపరిమాణము రోమజంబులన్
దెనుఁగున నెల్లవారలకు తేటపడన్ రచియింతు సత్కవుల్
వినిగొనియాడ దానగుణ విశ్రుత కన్నయమేదినీశ్వరా. 2

హయలక్షణవేత్తయగు శాలిహోత్రుఁడు మున్ముందుగా జెప్పిన అశ్వలక్షణములను, ఆయుఃప్రమాణమును గురించి తెలుఁగున సర్వజనులకు దెలియునట్లుగను- సత్కవీశ్వరులు గొనియాడునట్లుగను జెప్పెదను అని కృతికర్తయగు మనుమంచి భట్టారకుఁడు జెప్పియున్నాఁడు. ఈగ్రంథము సాళువ కంపభూపాలున కంకితమీయఁబడినది.

క. జలనిధిమథనావసరమున
జలజభవునిమేని పద్మ జలకణములుగా

డ్పుల సంగమమున భావక
వలె హారులు పుట్టె గన్న । వసుధాధీశా! 3

దేవదానవులు సురకొఱకై పాలసముద్రమును మందరపర్వత
ముచే తరుచుచున్నప్పుడు- బ్రహ్మదేవునియొక్క స్వేతబిందువులు గా
డ్పులతో గలసెను. అప్పుడు హయము ఉద్భవమందెను.

సీ. తొలుతదంతంబులు । తోచిన నొకనెల
నెలలురెండగునవి । * నెరసి నిగుడ
నడిమిదంతములుగా । నగనైన మూణ్ణెల్లు
యవివెనగూడంగ । నైదునెలలు
కడపదంతంబులు । వొడమ నెన్మిదినెలల్
యవిగూడ తొమ్మిది । యయ్యె నెలలు
దశనంబు లారును । విశదమైనను నేడు
యేళ్లురెండగునవి । ఎర్రనైన
మొదటిరెండును బదిగూడ । మూడు యేండ్లు
నడిమి రెండును పదిగూడ । నాలుగేండ్లు
అవియు రెండును బదిగూడ । నైదుయేండ్లు
యరయహారులకు గన్నదం।డాధినాథ.

* బలసి నిగుడ అనిపాఠాంతరము. యవి తెన్నగుటయు
ను నైదునెలలు పా.

ముందరిదంతములు బొడసూపిన గుర్రముయొక్క ప్రాయ
మొగనెల-ఆముందరి రెండుదంతములును బలసినవై పొడవైనమొద
ల రెండునెలలు గుర్రమగును. మధ్యదంతములు గాన్పించిన మూడు
మాసములు- అవి స్ఫుటమైనవైనచో నాల్గునెలలు మిగిలినదంత
ములు వచ్చిన గుర్రముయొక్క ప్రాయ మెనిమిదినెలలు. ఆరుదంత

ములు విశదములైయున్న యేడు నెలలగును. అదంతము తెరచినయిన రెండేండ్లు అన్ని పండ్లును గలియుట కయిదేండ్లుపట్టును.

కం. దంతముల తెలుపుచిత్త
 క్షాంతియు కన్నులమెఱుంగు । జవసత్వములన్
 సంతతమును దక్షతయును
 కాంతియు నైదేండ్లఘోట । కంబునకలరున్. 5

దంతములు తెల్లనగుట- స్థిరచిత్తముకలుగుట- కన్నులలోని మెఱుగతిశయించుట- బలము- పనిచేయునేర్పును శరీరమునందలి తేజస్సునుగల తురగముయొక్క వయస్సు అయిదు వత్సరములు.

కం. ఇది విచారించుటయును
 విదితంబుగ నశ్వములకు । వినువ్యంజనముల్
 మొదలుకొని వరుస జెప్పెద
 సదమలగుణయూధ కన్న । జగతీనాథా! 6

పైన చెప్పబడిన విషయముల నిరూపించుటయును, వ్యంజనముల క్రమంబును యొకటొకటిగా జెప్పెదను.

ఉ. నల్లనిరేఖ కృష్ణహారి । ణంబుసువర్ణవిభాతి శుక్లమున్
 తెల్లని కాచగాజుపగిదిన్ జనుమత్కికయారె యట్లుతో
 భిల్లును శంఖచంద్రుగతి । బెద్దయుగ్రంతలులూఖలంబగున్
 బెల్లుగ నూడుటంబడుట । చెప్పనతొమ్మిది వ్యంజనాలగున్. 7

చూడుము మూడవయాశ్వాసము. కృష్ణవ్యంజనము, శుక్లము హారిణవ్యంజనము, మత్కిక, శంఖఉలూఖలము చలనవ్యంజనము, పతనవ్యంజనము, కాంచవ్యంజనము.

కం. నెట్టున మొదలిరదంబులు
 బుట్టిన నొకయేడునడిమి । పళ్ళునొనరన్

బుట్టిన రెండేండ్లకుదగ
బుట్టిన మూడేండ్లు ముట్టు । పరువడినడచున్. 8

మొదలిరదనములు తోచినమొదల నొకసంవత్సరమును, మ ధ్యపండ్లు బుట్టిన రెండేండ్లును, వెనుకటి రెండుదంతములును బుట్టిన మూడేండ్లను యుండును.

గీ. ఈనవవ్యంజనంబులు । యిట్లునడువ
నెలమియిరువది యేడేళ్ళు । యిందులోన
తొలుత నైదేండ్లుగూడ । తురగమునకు
నరయముప్పదిరెండేండ్లు । నాయువయ్యె. 9

పైన చెప్పబడిన తొమ్మిదివ్యంజనములును గడచుటకు యిరు వదియేడు వత్సరములగును. ఆయిరువదేడు వత్సరములును బాల్యమై దేడులును కలసి గుర్రమునకు ముప్పదిరెండు వత్సరములు పూర్ణా యువయ్యెను.

10. గ్రంధపాతము యితరప్రతులలోనున్నదేమో తెలియదు.

క. ఉరమున నుపరంధ్రంబుల
శిరసున రంధ్రంబులందు । జెలువుగ రెండే
నరయగ నుదుటనుమూతిని
బరువడి యొకటొకటియున్న । పదిధృవులయ్యెన్.

సులభసాధ్యము. గుర్రమునకు తప్పక పదిసుళ్లుండవలయును.

కం. ధృవులుపది యశ్వజాతికి
నవితక్కువమైన తురగ । మల్పాయువగున్
నవరించు పతికరిష్టము
నవరించరు గాన బుధులు । నహింపరుగా. 12

ధృవులు పది యుండవలయును. పదికంటె తక్కువమైనయెడ ల నాయశ్వము అల్పజీవియగును. ఇంతియేగాక ఆగుర్రముయొక్క

యజమానునకు గూడ కీడుగల్గును. అందువలన హయశాస్త్రవేదు లెవ్వరును యట్టిగుర్రమును కొనరు.

క. మస్తకహీనము బహుదుర
వస్థంబడి జచ్చు నైదు । వర్షంబులలో
స్వస్తపడిని నిలిచెనేనియు
మస్తకమునుద్రుంచు పతిని । మర్త్యులచేతన్. 13

చిన్నమస్తకము (తల) గలిగియున్న గుర్రము పెక్కుచిక్కుల కు లోనై యైదువత్సరములలోపలనె మరణించును. అట్లు మరణిం పకున్న నాహయము తన్నుపాలించువానియొక్క మస్తకమును రిపు లచే దుంపఁజేయును.

చం. స్థిరముగరోచమానమును । దేవమణిందగ గూడియున్న యా
తురగము పూర్వభాగ గత । దోషములన్నియు ద్రుంచునెట్టిన
బరగినయట్లు మేఘవిక । పశ్చిమభాగము దోషరాసులన్
బోరిబోరిద్రుంచు మాడ్కి మరి। భూవరకప్పున దక్కనన్నిటన్. 14

మెడమీదనుండునట్టి జూలునందు సుడియును దేవమణియను సుడియును గల తురంగము యితరదోషములను బోకార్చి శుభంబుల నొసంగును.

క. చుంచున కేశాంతంబుల
నంచితముగ నెలవులందు । నావర్తములన్
మెంచలరదాల్చు హయములు
పంచాయుధ జనకశుభము । పతికొసరించున్. 15

ముట్టెయందును, కేశాంతమునందును, నెలవులయందును, (నో టికిరుపక్కలనుండు మూలలందును) సుళ్ళుగలిగిన హయము తన్ను బరిపాలించు యజమానునకు శుభమునిచ్చును.

క. బాహువులను సుళ్ళుగలిగిన
బాహావర్తంబులనగ । పరిభులకు నెపుడున్
బాహులనుదొడుగు దొడవులు
యాహవమున జయమునొసగు । నరిబలభేదీ. 16

ముందరకాళ్ళ సుళ్ళుగలిగియున్న తురగము బాహావర్తతురంగమనబడును. దానిని పాలించు యధికారి యుద్ధములందు జయలక్ష్మిచే వరింపబడును.

సీ. ఇప్పుడు జెప్పిన । ముప్పదిరెంటిలో
నుత్తమావర్తంబు । నుండు నెడల
నిటలతటంబున । నిశ్శ్రేణి త్రితాగ్ని
బాతురంతికము ప్ర । ఖ్యాతి మెఱయ

*　　*　　*　　*　　*

రోచమానంబుగదియుంగ । రోమజముల
చాలుగట్టమునకుగల్గి । చాలమేలు
తోలంత పదిసుళ్ళుకూడంగ । నలుబదేను
మేలుచాతుర్యభోజ ల । క్ష్మీశనూజ. 17

సీ ముందరికాళ్లను । మోకాళ్ళజంఘల
విశిపట్లమణుగుల । మడుగులందు
తొలగులబిరుదున । తొడలందునగుల
నటకిందిపిక్కల । యండములను
కాశదేశంబున । గుదమునపక్కల
బొడ్డున వీపున । బొమలమీద
కుత్తుకకన్నుల । కొలకులరెప్పల
కర్ణమూలములను । కటములందు

దండమున ముక్కుజమరుల । క్రిందిపెదవి
జెక్కులను మూతిమీదను । జెవులతుదల
కన్నుగవనాసికమునకు । గలిగియొనర
నున్నసుళ్లొప్పు నిన్నియు । గన్నభూప.

ముందరికాళ్ళయందునను, వెనుకాళ్ళయందునను-జంఘలుకలి యుచోట్లను మణుగులందును పిరుదునందునను తొడలయందునను అడుగులయందును పిక్కలయందును అండములయందును యోనిదేశ మునను బొడ్డునను వీపుమీదను కనుబొమలమీదను కనుకొలకులం దును రెప్పలందును చెవిమూలములందు గండభాగమునందును సు ళ్ళుండదగు సులభసాధ్యము.

క. కకుదంబున హల్లకమున
దిక్కమునసందులను సుళ్ళు । దిరమైయున్నన్
బ్రికటితదోషం బగునిది
నకులాదుల మతముదండ । నాయకతిలకా. 19

మూపుమీదను హల్లకమునను గుదస్థానమునందును చంకల యందును సుళ్ళుగలిగిన వాజి దోషయుతమగును.

గీ. జలజకులిశకలశ । చామరతోమర
చక్రముసలముకుర । శంఖచంద్ర
మణిసితాతపత్రఖడ్గ । మచ్ఛాంకుశాదులు
గతులబొల్లు మేలు । గన్ననృపతి. 20

పద్మము కులిశము చెంబు చామరము తోమరము చక్రము ముసలము రోకలి ముకురము (మొగ్గ) శంఖము చంద్రుడు మణి ఖడ్గము అంకుశమువున్నగువానివలె నుండు తెల్లనిబొల్లియుండుట మంచిది.

గీ. శూలపాశనిగళ । నీలపీతారుణ
గతులబొల్లిగీడు । గడిమదలను
క్రిందిపెదవి జమర । రుజలందునెడతెగి
యున్నపుండ్రరేఖ । యొప్పదంద్రు. 21

శూలము పాశము నిగళము (శృంఖలు-అరదండములు.) నీలి వన్నె పచ్చనివన్నెగల బొల్లులుండరాదు. అందువలవ కీడుసంభవించును. తలయందును క్రిందిపెదవియందును ముక్కు-జెమరలందును బొల్లియుండరాదు.

సీ. దంతాధికంబును । దంతకనమును హీ
రాళియైనను వికి । రాళియైన
బిల్లికన్నులునేక । పింగళియును నొంటి
బీజంబులెమ్మను । బిల్లిచెవియు
దినమునబుట్టిన । గవయుద్భవిల్లిన
జనుబొట్టుకరగుట్ట । మునకునున్న
కృష్ణతాలువలు మి । క్కిలియైన గోరిజలు
నల్లనైకడు పెల్ల । వెల్లనైన

* * * * * *

అట్టిహయముల పాలల । గట్టజనదు
మల్లయామాత్య పుత్రి నిర్మలచరిత్రి
అహితహృద్భల్ల రాయసా । హాత్తిమల్ల. 22

ఎక్కువదంతములు తక్కువదంతములు గలిగిన గుర్రమును కరాళివికరాళిని (వీనియర్థముముందు వివరరింపబడును.) పిల్లికండ్లు కలదియు యేకపింగళి (ఒకకన్నుదృష్టి) ఒకబీజముకలది పిల్లిచెవులు రెండుపిల్లల నీను గుర్రము నల్లని తాలువలుకలది- పెద్దపెద్దగిట్టలు గలది- మున్నగు దోషంబులుగల గుర్రములను పెంచకూడదు.

కరాళి=భయంకరమైనది.

వికరాళి=భయంకరమైనదానికి వ్యతిరేకము.

గీ. మూడుకాళ్లునుగల్గిన । ముసలియొక్క
పదమునిలుపైన నదివిష । పాదియండ్రు
సన్నమగుచున్న దోషంబు । లెన్నిమైన
నుదుట బొల్లుంట మేలున । ఋమ్మదితహృదయ.

మూడుగాళ్ళను తెలుపైన బొల్లియుండి నాలుగవపాదము-నలుపైనయెడల నాగురిము విషపాదియగును. కాళ్ళు సన్నమైనయెడల దోషముల నెన్నిటినేని బోకార్చును.

క. మెఱుగారికాయలు మేనును
నెరివిరిసిన తమ్మిమూడ్కి । నెమ్మొగమున గో
మ్మెరుగుల దెగడెడి కన్నులు
నెరివాలము గలుగు హయులు । నివి యోగ్యంబుల్. 24

మెఱుగెక్కియున్న శరీరమును, సగము విడిచిన పద్మమువలె నుండు నెమ్మొగమును, కాంతివంతములైన కన్నులును చక్కనివాలమును గలహాయములు శుభము చేకూర్చును.

క. ఛాయావిహీనమైనను
వాయసఖరగృధ్రిముఖ్య । స్వరమైనను దై
న్యాయపదగదితవదనము చి
రాయువు గలుగవని విందు । మట్టి హయంబుల్. 25

కాంతి విహీనమైనను కాకి-గాడిద-గుడ్లగూబ మొదలగువాని స్వరముబోలిన స్వరముగల తురంగములు చిరాయువులుగ నుండవని పెద్దలమతము.

క. పరగిన మొగమును నాలుగు
చరణంబులు తెలుపుగలుగ । జయమొనగునరే

శ్వరునకు నత్తురగంబిల
ఖరకరనిభ తేజపంచ । కల్యాణియగుఁగా. 26

నాలుగుకాళ్ళను తెలుపుగలిగియున్న హయము పంచకల్యాణియనందగును. అయ్యది రౌతునకు సర్వదాజయము కలిగించును.

క. నాలుగుకాళ్లుం గొనచెవి
వాలమువదనము విశాల । వక్షము తెలుపై
కాలినది యష్టమంగళి
నెలినపతియేలు ధరణి । నేలినపతులన్. 27

నాలుగుకాళ్లును- చెవులయొక్క- కొనలును- తోకయును ముఖమును విశాలమైన వక్షస్థలమును తెల్లనిపైయున్నయెడల నాగుర్రమును యష్టమంగళియందురు. ఆగుర్రమును పాలించువాడు ధరణీపతుల నేలును.

క. హేషారవంబు గజగళ
ఘోషానకపయోధి । ఘోషణభేరీ
ఘోషణదిక్కరి బృంహిత
ఘోషణగతి నుండవలయు । ఘోటకములకున్. 28

గుర్రములయొక్క- ధ్వనినిగూర్చి చెప్పుచున్నాడు. సులభసాధ్యము.

క. తొల్లిశతాయువు హయులకు
ఎల్లను దుర్జనులమోవ । నేహ్యాంబనితా
రొల్లకముప్పది రెండే
ళ్లలన తురగములువడసె । నమరులచేతన్. 29

పూర్వము బ్రహ్మ- గుర్రములు దుర్జనులగువారిని గూడ మోయుచుండుట జూచి విచారపడి వాని యాయుఃప్రమాణమును ముప్పదిరెండుసంవత్సరములుగా నేర్పరచెను.

క. వన్నెసుధాధవళంబై
చెన్నారగ నల్లనైన । చెవికల్గినయా
సన్నుతతురగము యీభువి
గన్నయధరణీశనామ । కర్ణాంకమగున్. 30

తెల్లనిశరీరముగలదై నల్లనైనటువంటి చెవిగలిగిన యశ్వము
ను కర్ణాంకమందురు.

చ. హరియని నర్కబింబునిశు । కాంగుని గొంగునిగొంగుపాణినా
తరగినికత్తలాని భ్రమ । దంబుననెక్కెడిచోట భూపతుల్
సురపతి కృష్ణవహ్నిశివ । సూర్యపితామహవాయుసోములన్
వరుసదలంచి మొ్రొక్కనది । వారకదైవత కోటిగావుతన్. 31

హరి, అర్కబింబము, శుకాంగు- కొంగ గొంగుపాణి తరగిణి
కత్తలాని ఈపేర్లు గలిగిన గుర్రముల నెక్కునప్పుడు ఇంద్రుని కృష్ణుని
అగ్నిని- శివుని సూర్యుని బ్రహ్మను వాయు, చంద్రుని దలచి వారికి
నమస్కరించి ఎక్కవలయును.

క. నీలిని నలగని శోణిని
నీలోత్పలహయముబన్ని । నృపులెక్కెనచో
మేలుగనదియును త్వష్ట్రిల
కీలినివాయువుదలంప । గెలుపగుబోరన్. 32

నీలి నలగ శోణి నీలోత్పలము ఈనాలుగుపేర్లుగల గుర్రము
లు నెక్కునప్పుడు అగ్నిని వాయుదేవుని దలంచికొనిన శుభము చే
కూరును.

క. చతురమగు నొసలవాలుగు
వితతముగా నశ్వములకు । వెలసినధృవులన్
మతిదలంప మేలునిచ్చును
పదునాలుగుదేశములకు । బట్టముగట్టున్. 33

గురఁ్రిముయొక్క నొసటను చతురాకారముగ నాలుగుధృవ్రులున్న యెడల నాగురఁ్రిము తన్నెలినవానిని పదునాలుగుదేశములకు పట్టభద్రుని చేయును.

క. పట్టముకిర్రియఫాలంబున
వెట్టణముసుళ్ళుమూడు । నేర్పడియున్నన్
గట్టుము హయమును శాలను
సృష్టికిపతియతఁడునువ్వె । స్థిరమతిదలపన్. 34

పటకావలె నుదిటిపై మూడుసుళ్లుగలిగిన యా తురగమును శాలలోనికిఁ జేర్చుము. ఆగుఱ్ఱము నేలినవాడు బ్రహ్మతో సమానుఁడగును.

క. ఒండొంటి మీఁద దొంతిని
రెండునమూడైనధృవ్రులు । రుజలైయున్నన్
గండతనిజముగ నిలువ్రుము
భండనమున నశ్వమిచ్చు । బతికిజయములన్. 35

సులభసాధ్యము.

క. నిటలమున దొంతివలనయు
పటుతరముగ సుళ్ళుమూడు । ప్రభవించినచో
నిటలాక్షు డడ్డగించిన
చటులతననిలోనవైరి । శిరమునుద్రుంచున్. 36

సులభసాధ్యము.

క. మిక్కిలిదోరణములకిర్రియ
జక్కగరోమజయములశ్వ । సంఘము నుదుటన్
నిక్కముగల్గిన శుభమా
ఎక్కుము రణరంగభీమ । యెంతయు బ్రీతిన్. 37

అధికముగా సుళ్లుదోరణమువలె నున్నయెడల శుభదాయక మగును-దానిని యధిరోహించు యజమానునకు శుభము చేకూరును.

క. తురగంబునొసలిమీదను
బరికింపగ రెండుధృవులు । ప్రభునకు శుభమా
నరనుత విఖ్యాతగుణ
ధరణీశ్వర కృష్ణనృపతి । దానవినోదీ. 38

గుర్రముయొక్క నొసటను రెండుధృవులుగలిగినయెడల తన్నెక్కినవానికి శుభము చేకూర్చును.

క. కుత్తుకసుడిగల తురగము
చిత్తజనిభుడైనసేమి । సిద్ధముదలపన్
ఉత్తమపురుషులు విలువరు
నిత్యంబును జూడజముని । నిలయము కేగున్. 39

సులభసాధ్యము. కుత్తుకమీద సుడియుండరాదు.

క. ఉభయగళములకు నెల్లను
నభిముఖముగ ధృవులుగల్గు । నశ్వము విలువన్
శుభమగు కంఠాభరణము
ప్రభుసుత భీమాంబపుత్రి । పరమపవిత్రీ. 40

గళమునకు రెండుప్రక్కలనుగాని యెదుటనుగాని సుళ్ళుగల తురగము కొనవలయు. అట్టిగుర్రము శుభము చేయు.

క. మేలుగ గళంబుక్రిందను
నాలుగుయంగుళముల రెట్టి । నగు సుడియున్నన్
యేలుమది దేవమణియని
బాలార్కసమాన తేజ । బంధునిధానా. 41

సులభసాధ్యము. గళముక్రింద ఎనిమిదంగుళములకు క్రింద సుడియున్న యది దేవమణియను సుడియగును దానినేలవలయును.

క. దేవమణి క్రిందసుడియును
భావింపఁగ రోచమాన । మగునని ధాత్రిన్
భావజసన్నిభ విలువ్రుము
భూవనితాప్రియుడ కృష్ణ । భూపలలామా ! 42

దేవమణి క్రిందగానున్న సుడిని రోచమానమందురు. అట్టిగుఱ్ఱమును భద్రాయము. తప్పక కొనవలయును.

గీ. రోచమానంబుక్రిందని । రూఢమగుచు
నమరసుడి జెఱిపాకిన । నట్టిరేఖ
పేరుహారికిజూడ । ధారుణిలోశత
పాదియనిరి యశ్వ । భావవిదులు. 43

రోచమానముక్రింద జెఱివలె గొన్నిటిసుడి యుండును. అట్టిగుఱ్ఱమును శతపదియందురు.

క. బాహులవక్షస్థలముల
నూహింపగ ధృవులుగలుగ । నుచితము విలువన్
ఆహవభీముడపాత్రత
దేహీంజనకల్ప భోజ । దినకరతేజా. 44

ముందరి కాళ్ళమీదను వక్షస్థలంబునను ధృవులుగలిగియున్న యశ్వమును గొనవచ్చును.

సీ. త్రికమున వీపున । కకుదాంగకములను
భృకుటిపై నాసాగ్ర । పుటముమీద
హృదయమునను నాభి । యుదరముకుత్తుక
చెక్కునముక్కున । ప్రక్కలందు
గుదమునవిత్తుల । కోశముమెడలపై
నేత్రాలనాలుగు । గోత్రములను

మస్తకమధ్యము । మూనుగాకటనములన్
నేకవింశతి ధృవ్వు । లెరుగజనులు
యిట్టిదోషంపుహయములు । గట్టదగదు
గట్టినంతనె చెట్టలు । బుట్టుచుండు
బుధజనస్తోత్రిసద్గుణ । పూర్ణగాత్రి
వంశకులదీప శ్రీకన్న । వసుమతీశ. 45

కం. అనియవములందు నెడలక
ధృవులుండగ వలయుమరియు । తురగంబులకున్
దివిరియొండొంటి వెడలక
సువిచారుడనామతంబు । సుభగమనోజా. 46

గుర్రముయొక్క యవయవములందు తప్పక సుడియుండవల యును. అసుళ్ళువిచ్ఛిన్నముగాక యుండవలయును. ఒక్కొకసుడి రెం డవదానిని తాకి దానిని వికలమగునట్లు చేయకుండవలయును. అని మనుమంచిభట్టు తనయభిప్రాయము జెప్పెను.

క. మిక్కిలి నశుభములైనను
దక్కువ శుభధృవులుగల్గ । దగదెక్కంగా
ఎక్కుమురుజులకు శుభములు
మిక్కిలి గలుగంగజూచి । మృగపతిశౌర్యా. 47

అశుభసూచికంబులగు సుళ్ళధికముగను శుభసూచికంబులగు సుళ్ళు స్వల్పముగనుయున్న యశ్వమును గొనదగదు. శుభసూచకము లధికముగానున్న పరిశీలించి దాని నెక్కవలయును.

క. కలియుగమున తురగములకు
సలలితముగ బాహుయుగము । సన్నములైనన్
బిలువుము తురగముశుభమని
యిలతలమున కొంకణపతి । యిభరిపుశౌర్యా. 40

గుర్రమునకు ముందటికాళ్లు సన్నములై యుండుటమేలు.

క. వాలంబు బాహుజంఘల
మేలుగ కంఠాననంబు । మేదినిమీఁదన్
ఫాలము కర్ణము మెడయును
జాలగదీర్ఘంబులైన । జవమానియగున్. 40

తోకయు కాళ్లును-జంఘలును-కంఠము—ముఖము చెవులు మెడయును మిక్కిలి పొడవైనయాతురగము మిక్కిలి జవసత్వముగలది యగును.

క. బాహులుజంఘలుమధ్యము
వాహనపతి నెరుగుముఖము । వాలముచెవులున్
నూహింప కురుచలైనను
ఆహాసభీముండ సత్వ । మధికముసుమిహీ. 50

కాళ్లును జంఘలును మధ్యభాగము (కటిప్రదేశము) ముఖము తోకయు చెవులును కురుచలైయున్న యశ్వము వేగముగా పోవునది గాకున్నను బలముకలది యగును.

క. ముష్కములు కురుచలై కడు
శుష్కంబులునైనజూచి । సుజనుడవిలువన్
నిష్కముల లెక్కసేయక
దుష్కరములబొందడెంత । దూరంబైనన్. 51

ముష్కములు (వృషణములు) కురుచగలిగి ఎండిపోయినట్లున్నపొడల రూప్యములుఖర్చు పడునని లెక్కసేయక తప్పక గొనవలయును. ఎంతధనము వెచ్చించినను నష్టములేదు.

క. పలువరుసనేడు దంతాలు
కలిగిన జవసత్వహీన । కాంతివిహీనన్

విలువరుశతులకు నెక్కఁడ
కులజలనిధిపూర్ణసోమ । గుణరత్ననిధీ. 52

ఏకదంతములు గలదానిని బలము జవము లేనిదానిని కాంతిలేనిదానిని భూపతులెక్కఁగూడదు. దానినికొనరు.

కం. బలువైకొలఁది వెన్నును
వలుదగుమధ్యంబు నిడుద । వాలము నైనన్
వెలయఁగ వట్రువలైనను
గలుగుమెడ గుర్రములను । గట్టుము సాలన్. 53

బలమైనట్టియు కురుచయైనట్టియు వీపును- బలముగలిగి లావైనమధ్యమును- పొడుగు పాటితోకయు- గలిగినటువంటి గుర్రమును శాలయందు గట్టియుంచుము.

కం. బడపంబో లేడిరూపము
కడుగుర్రముపతుల కెక్క । కడు యోగ్యముదా
కిడునర్ధి విలువవలయును
కలియుగమున సిరియునొసగు । కన్ననృపాలా ! 64

ఆడుగుఱ్ఱము ముఖమువలెనున్న మొగగుర్రము శుభదాయకము తప్పక విలువవలయును.

కం. వదనంబును భ్రూలంఘ్రులు
విదితంబుగ దెల్లనైన । విలువుము హయమున్
కదనమున నెక్కినతనికి
నెదురారిపుఘోటకము । నేనుగుఘుటముల్. 55

ముఖమును- అంఘ్రులును- భ్రూయుగమును దెలుపైయున్న యశ్వమును గొనుము. దానినెక్కినవానికి శత్రుసేనలోని గుఱ్ఱములు యేనుగులు సులభసాధ్యములు.

కం. భూపాలయపరగాత్రము
నేపారగ దెల్లనైన । నెక్కుము హయమున్
యేపైవిలువగ వలయును
యేపొందుం లచ్చిమిగుల । వినయగుణాఢ్యా.

కంఠముయొక్క క్రిందిభాగముగాని మీదిభాగముగాని తెల్లనైన గుర్రమును నధిరోహించుము. అట్టిహయమును గొనినవానిగృహంబును నైశ్వర్యములు సర్వదా నిలచియుండును.

గీ. నొసలజుక్కలేక । శశికాంతి నొకకాల
మూడుకాళ్లుగలుగ । మొసలియండ్రు
దీనివిలువవలదు । మానవులకు
వంశదీప కన్న । వసుమతీశ. 57

నొసటిమీద తెల్లని మచ్చలేకను మూడుకాళ్లను తెలుపుండి యొకకాలను తెలుపులేకున్న నాయశ్వమును మొసలియందురు. దానినిగొనవలదు.

క. వలపలికాళ్ళను రెండును
వెలయగ సితవర్ణమైన । విలువుముహయమున్
సలలితవామాంగంబులు
వెలయగదెలుపైన గాదు । విమలవిచారా. 58

వలపలికాళ్ళు రెండును తెల్లనివైనయెడల నాహయమును తప్పక గొనుము. ఎడమభాగము తెల్లనైన నాహయంబులను గొనవలదు.

కం. పాదములు మూడుగడగిన
భేదింపక మొసలియండ్రు । పెద్దలుహయమున్
మేదినిలో జూడగ నొక
పాదంబడి గడగవిషము । పాదిదియయ్యెన్. 59

మూఁడు పాదములు తెలుపై యొకపాదము నలుపైన మొసలి యండ్రు. అటుగాక మూఁడునలుపై యొకటి తెలుపైన నదివిషపాది యని పిలువఁబడును.

క॥ ఎక్కఁగ జన దమ్మొసలిని
నిక్కంబుగ విషముపాది । నిందితమయ్యెన్
ఎక్కువ నుదుటనుహాయమునకు
చక్కఁగ బొల్లుండెనేని । సౌజన్యనిధీ. 60

ఆ మొసలి యని పిలువబడు తురంగమును యెక్క బోవకుము. అది విషపాదియగుటచే నింద్యము. నుదుటను చక్కనిబొల్లి యున్న యశ్వము నెక్కుము.

క. పట్టరు గోడిగ నేకిరియు
స్పృష్టిశ్వేర వెనుకవడము । సితమైయున్నన్
నెట్టనమూత్రము విడిచను
బుట్టవు దోషంబులండ్రు । బొల్లరిలేమిన్. 61

గుర్రము యొక్క పృష్టభాగము వెల్లనై యున్న యెడల నా గుర్రమును గొనరు. అధికముగ మూత్రమును విడుచు హయమును గూడ దోషము కలుగునని తలంచి గొనసాహసింపరు.

క. పుర:పార్శ్వమునకు మూఁదట
సరసిజరిపువర్ణమైన । చరణముగలుగన్
స్థిరమతి విలువగవలయును
యురుదుగమూత్రంబు దాకి । యురుగుంబుజులన్. 62

ముగుర్రమునకు ముందటి భాగము సూర్యునియొక్క వర్ణమైనచో బుద్ధిమంతులు దాటి పోనీయరు. తప్పక స్థిరచిత్తముతో గొందురు.

క. శ్రీజన్మసదనరాజ
 ద్వాజితయసమానవయన । రాజీవనక్షా
 రాజులకు దుగ్ధవారధి
 రాజనరుణా కుమారకంప । రాజునకెలమిన్. 63

షష్ట్యంతములలో నిదిగావచ్చును. వెక్కులగు మాతృకల లో నీపద్యము గానరాదు.

వ. అభ్యుదయము పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన హయలక్షణవిలాసంబను కృతికి కథావిధానం బెట్టిదనిన నశ్వప్రశంసయు నావర్తలక్షణంబును దశాక్షేత్రవిభాగంబును ప్రవేశ ప్రమాణంబును వయోజ్ఞానంబును వర్ణలక్షణంబును ఛాయాలక్షణంబును గంధలక్షణంబును గతిలక్షణంబును సర్వలక్షణంబును పుండ్రలక్షణంబును సామాన్యదోష మహాదోష దోషతమప్రకారంబును నుత్తమాశ్వలక్షణంబును విహీనలక్షణంబును చికిత్సయు లవణవిధియు ఉదకవిధియు గడ్డికపణప్రకారంబును క్రమంబున జెప్పెద నందు నశ్వప్రశంస యెట్టిదనిన. 64

అశ్వములకు సంబంధించిన వివిధములగు లక్షణముల జెప్పెదనని సూచించినాడు. సులభసాధ్యము.

ఉ. అంబుధివేష్టితావనియు । తాజి జయంబు మహాయశఃప్రతా
 పంబును నిత్యలక్ష్మియు న।పారసుఖంబుల నొందునందు ధ
 ర్మంబును వైభవోదయ స।మగ్రముదంబులుగల్గి యొప్పువా
 హంబులు చాలగల్గు వసు।ధాధిపుడెప్పుడు నింద్రతుల్యుడై. 65

గుర్రములధికముగా నేభూపాలుని యొద్దనుండునో యాభూపాలుడు చతుస్సముద్ర ముద్రితధరావలయంబు పరిపాలించుచు యశఃసాంద్రుడై లక్ష్మియుతుడై సర్వసౌఖ్యంబుల నొందుచు నధిక వైభవము గలవాడగును.

చ. అరయఁగ సర్వలక్షణ సమంచితమైన తురంగరత్నమే
నరుని గృహంబునందొక దినంబునను దగురీతి నుండునా
పరమ పవిత్రగేహమున బాయకనిల్చు రమావధూటి శ్రీ
ధరుని యురస్థలంబలె ముదంబెసలార ప్రసన్నచిత్తయై. 66

సర్వశుభలక్షణములను గల్గిన గుఱ్ఱమే మానవునియింట నొక దినంబు యున్నను-యామానవునకు యధికంబులగు ధనంబులు లభించి-స్థిరమై నిలిచియుండును.

మ. జవసత్వాశ్వతవైభవావళులచే సంపూర్ణమైయుండునే
యవనీపాలున కైన్యమాతని సముద్యత్కీర్తి బెంపారియుఁ
నవపర్యంత వసుంధరావలయమున్ మానంబుతో నేలు శా
త్రవ * * * * *

గ్రంథపాతముచే గడమపాదము నశించినది. అర్థముస్ఫురించుట లేదు.

చ. * * * * * *
త్రవధరణీధరేశ్వరుని దానముపాలిటి లచ్చియైమహో
త్సవములుగ ర్తగూర్చు రణధామములో మహారాజకోటికిఁ
శివశిఖఘోటకంబులు విచిత్రపు దూతిక లే తలంపఁగన్. 68

గ్రంథపాతము పైపద్యముతో గలిపి పెక్కుమాతృకలందు గలదు.

చ. దూరము బోవునప్పుడును దుర్దమశత్రునృపాలసైన్యముల్
బోరున గెల్చుచున్నపుడు బొంకముతో మృగయావినోదవి
ద్యారతిదేలునప్పుడు నరాధిప కోటికి వాజులట్లు బెం
పారజయాది కారణము లారసిచూడఁగ గల్గనేర్చునే. 69

దూరదేశముల కేగవలసివచ్చినప్పుడును-శత్రువులను జయింప బోవునప్పుడను వేటాడుటకున్న విద్యాప్రసంగముల దేలునప్పుడు

ను రాజులకు గజంగడు సహాయ మొనరించి జయముచేకూర్చును-
యిట్టి సహాయ మొనర్పదగిన వేమైన గలవా?

ఉ. వారణసేన లెన్నియును । వాజిబలుండగు రాజుకెప్పుడున్
వైరులబోరగెల్తురని । వారణరాజులు నిక్కువంబు దు
ర్వారపు వాజి యొక్కటి ని। వాసమునం గలిగున్న జేనికిన్
వారక శంకనొందుదురు । వైరులు మున్నుగ కంపభూవరా. 70

శా. విశ్వంబందు వసుంధరాపతులకున్ । విఖ్యాతిబీజంబులై
యశ్వంబుల్ గుణనాధుకావ్యములు చే। యంజాలు చందంబునన్
శశ్వద్దాన ఘశఃపటీవిలస। స్తంబేరమంబుల్ కడున్
యైశ్వర్యాత్యపదాతిలోకములు సే। యంజాలునే క్రిమ్మరన్. 71

చ. కరిగధవీరభీషణ వి। శార జలగ్రిహాకోటిచేతను
స్తరమగు వైరిభూరమణ । సైన్యపయోధి నెన్నశశ్వమం
దరగిరిద్రిచ్చగాక మరి । తక్కినరీతుల ద్రిచ్చవచ్చునే
యరయగవీరలక్ష్మి నిల। నాభశక్రపధరాత లేశ్వరా. 72

గజబలములు రథములు-పదాతులు-జంతువులతో నింపబడిన కంటకములు గల్గి తరింప శక్యము కాకయుండు శత్రురాజుల సైన్యమను పాలసముద్రమును ద్రిచ్చుటకు నశ్వమె మందర పర్వతము. అదియే లేనిచో శత్రుసైన్య పయోధిద్రచ్చుట యెట్లు?

మ. ధరణీమండలమెల్ల నశ్వముల చే। తంజాల సిద్ధించున
ద్ధరణీమండల సిద్ధియైన వలనం। ధర్మార్థకామంబులన్
ధరణీపాలకమండలంబులకు హా। స్తప్రాప్తమౌ గాన య
ద్ధరణీ రాజుల లాభసంపదకు గం। ధర్వంబులే మూలముల్. 73

రాజ్యభోగములు అశ్వములచేత లభించును. రాజ్యమువలన ధర్మార్థకామమోక్షంబులను చతుర్విధ ఫలంబులు లభించును. శా

వృన రాజుల జయమునకు-సౌఖ్యమునకు-(యిహపరసౌఖ్యమునకు)
మూలకారణము లీయశ్వములె గదా.

శా. దావానేక పరోహితంబు ధరవో । త్తాలంబు శాంతాపశం
పానూనద్యుతి దుర్నిరీక్షమురుబా । ణాసారముద్యద్వివ
త్సేనా వారధి మండలంబు గరిమం । జెండాడు నుద్దండత౯
భూనాధుండు హయాధిరూఢులగుచున్ । బోరు౯ సమీరాకృతి౯.

చ. వరశుభలక్షణంబులను । వర్ణనకెక్కిన ఘోటకంబులన్
ధరణిపుడెక్కి-బోవలయు । దజ్జగతీ పతిగోరివచ్చు నిం
పరుదున శత్రులక్ష్మి విభ । వాన్వితయై యభిసారికాకృతి౯
దురమున గంపభూరమణ । దోర్బల భీమకుమార మన్మథా. 75

క. వర్జితదుష్కృతసుకృతో
పార్జితవివిధార్థనిష్ట । రాహవకేళిన్
నిర్జిత శత్రుసముత్కర
మార్జితవైభవ సముఖ । తాయత కీర్తిన్. 76

సీ. చెలగి దేవాసురా । దులకు నయ్యింద్రుడు
సామంబులను దేవ । పాతనమితి
నాత్మ భాష్యంబున । ననిల దేవునియందు
నమృత పూరంబుల । నండములును
వాజులన్సృజియించి । వనజాసనుడు వాని
కన్నుల కమలారి । కమలహితుల
వాతెరసురనది । వాణి జిహ్వాకయందు
మెదనగ్ని మణుగు । మెడల దిశల
పసరునుక్కిన నంగము । ననలు నిలిపె
కాన హరులను వేల్పులు । గా దలంచి
నెమ్మి పూజించి యెక్కిన । నృపులకెచట
జయము చేకూరు గంపన । క్ష్మాతలేంద్ర. 77

మ. సుమనోవాహిని రోమరాజి జల ౹ ధి స్తోమంబు కాంచీకళా
పము శైలంబులు చన్నుగుబ్బలు పుర ౹ ప్రాకారముల్ తారహా
రము లై యొప్పగ నొప్పుచున్న యతుల ౹ ప్రారంభ విశ్వంభరా
ప్రమదం బార సుఖించు యశ్వపతియున్ ౹ ప్రస్తావర శ్రీగతిన్.

చ. తురగము నాజినెక్కి నిజ ౹ దోర్బల లీలలజూపి విద్విష
త్సరకరవాలధార దెగ ౹ గాంచిన పుణ్యుడు నందగాంచు త
త్తురగము మేనిపై గలయ ౹ దోచిన రోమము లెన్ని యన్నివ
త్సరములు నాకలోక వని౹తాసుఖ ముఖ్యవిశేషసౌఖ్యముల్. 79

ఉ. నెమ్మది లోననెంతయును ౹ నిశ్చలభక్తి చరింప దేవునే
మమ్మున సర్వలక్షణ స ౹ మన్వితమైన హయంబు నిష్టదై
వమ్ము దిభావినే నృపతి ౹ వందన కృత్యము లాచరించు ని
త్యమ్మును నామహీపతికి ౹ నాయువలును నగ్గలంబగున్. 80

చ. సమవిషమాజి రంగముల ౹ శత్రుశిరంబుల దూరి పారుచో
గమిగోని పేర్వుతెల్ల దెగి ౹ కాళ్ళను దాకుచు వ్రేలుచుండినన్
దమక మొకింత లేక నుచి ౹ తస్థితి నేలిక నుద్ధరింపు చి
త్తమతురగంబు దాని నుతి౹దామర చూతియు జేయనొప్పునే. 81

మాలిని. పరిహృతరిపు గర్వా ౹ ప్రాప్తగర్వాప హార్వా
భరణ విపులసేనా ౹ ప్రఖ్య నాఖ్యాభిరామా
పరిచిత న్నపవిద్యా ౹ ప్రస్ఫురద్గద్య పద్యా
చరణ పతిత భూపా ౹ చాళుకీవంశ దీపా.

గద్యము.......................................................

భైరవాచార్యపుత్ర మనుమంచిభట్టు ప్రణీత
మైన హయలక్షణవిలాసంబునందలి
ప్రథమాంకురము.





శ్రీరస్తు.

# అశ్వలక్షణసారము.



## ద్వితీయాంకురము.





రమణీ సేవాస్పద
పారీణ వివేకపరమ । పావనమూర్తీ
సారాచారవదాన్య
క్ష్మారుహ విద్యావిహార । కంపకుమారా.

లక్ష్మీదేవిని సేవించునటువంటి వివేకములుగలవాడుపావనమైన వాడా...కృతిపతియైన కంపకుమారుని కన్వయము.

క. తురగస్తుతి పద్యారస
ధరవిశ్రుతగతుల రీతి । దగజెప్పెదనా
దరభరితహృదయ పద్మను
కరమరుదు గజనకి దొడవు । గా జేయు మొగిన్. 2

క. వరలక్షణ నామంబులు
పరిపాటిగ జెప్పుచోట । బలికిన రీతుల్
పరికించి కరుణసేయుడు
సరసగుణోదారు లయిన । సత్క[illegible] 3

ప్రదాయకములై యుండును. ఆవర్తములలో శుభాశుభములు కలిగి రెండు తెరంగులైన యావర్తంబులయ్యెను.

క. ఉరమున శిరమున రంధ్రో
పరంధ్రముల రెండు ప్రస్థానములో
నుత్తరమున నొకటొకటిగ
వరవాజుల పయిని దశ పదిధృవులయ్యెన్. 9

గుర్రమునకు 10 ధృవులుండవలసినస్థానములు. చూడు- ప్రథమాశ్వాసమున 11 వ పద్యము. మరల నిచ్చట నేల చెప్పబడియెనో తెలియదు.

గుర్రముయొక్క తొలంకులందును, శిరముమీదను నుదుటను- వక్షమునందును.

అధిదేవతలు.

మ. వరగంవాజి తొలుంకులం శిరముపై ఫాలప్రదేశంబునన్
వరుసన్ వక్షముపై జనించిన సుడుల్ వర్ణ్యంబులో సుళ్లకున్
నరనారాయణ యక్షరాక్షసధృవుల్ నక్షత్రనాథాఖ్యులు
స్మరతాప్తుండును మందగంధ వాహుండున్ నాసత్యులుం దేవతల్. 10

గీ. మొండిమస్తక హీనమై యుండు వాజి
జతలకు జెడ్డయది కడు ముట్టదగదు
మున్ను తానున్న నెలవున నున్నహరుల
మన్నిగొనికాని నిలువనీ దెన్నిగతుల. 11

చిన్నతల గలిగియుండి- సుళ్ళు లేక మొండిదైనట్టి హయమును ముట్టుటకైనను తగదు. అదిశాలలోనున్న యితర గుర్రములకు గూడ హానిచేయును.

క. నెలవులముప్పదియునుగల
తురగంబును బ్రతుకు పెద్ద కాలముశుభమై

నిలువకుతె డవేశుభములు
వెలయుకయనిగొన్నిధృవులు । వెలిత్రైయున్నన్. 12

ముప్పదిసుళ్ళకు తక్కువయైయున్న గుర్రముఎక్కువకాలము బ్రతుకనోపదు.

క. నెలవులువిడిచివదమలో
పలనొక్కటి విడువబడిన । పరిపాటిమెయిన్
నిలువకతక్కినధృవములు
గలతురగము బ్రతుకువాడు । గట్టగనగునే. 13

ధృవు లుండవలసిన స్థలములలో నున్నయెడల నాగుర్రమును బ్రతుకదలచువాడు కట్టదగదు.

క. హీనావర్తంబులు ఫల
హీనముగా జేయుకొలది । నెక్కువయైనం
మానని నెవ్వగ నొసగును
గాన౦ ధృవుకొలఁది నిలుపఁగావలె హరికిన్. 14

ఆవర్తంబులను సుళ్ళులేని తురగము ఫలమీయజాలదు. ఎక్కువయైన నావర్తంబులు గల తురగముగూడ తీరనివ్యథనొసగును. గాన కొలదిగా ధృవులుగలిగి హరిని నిలుపవలయును.

క. నడుముతెగి రెండుదెగవై
పొడమినధృవుగలుగువాజి । బోదోలకనే
జడుడుతెగి నెక్కు నాతని
ఒడలునదల పొత్తకూడి । యుండకతడవై. 15

సుడినడమున తెగి రెంచు చేయబడిన తురగమును సాహసించి యెక్కువాడు చిరకాలము జీవింపకు.

క. నెలవుల నిలుపకదాపలి
వలపలిదెసకు దొలగియున్న । వలపలిసుడి దా

పలిదెసకుజనిన హరిభూ
స్థలినిజభూవిభుని రాజ్యవిత్త । చలనలుసేయున్. 16

కుడివైపున నుండవలసిన సుడి యెడమవైపునను ఎడమవైపు ననుండవలసిన సుడి కుడివైపుననుయున్న తురంగము యజమానుని ధనహీనునిజేయును.

శుభావర్తంబులు.

క. నెలవులనుదట బాహులతో
కలనొస కంఠతలల । కేశాంతములన్
గూబలపై సరసత
గల సుళ్ళుశుభమునిచ్చు । కంపనృపాలా. 17

శుభావర్తలక్షణంబుల దెల్పుచున్నాడు.

నెలవులందును నుదుటలందును బాహువులందును, నొసట లందును కంఠతలమందును కేశాంతమందును చెవుగూబలయందును సుళ్లుగల తురగము శుభములనొసగును.

సీ. శలవుల కేశాంత । ముల రెండురెండట్లు
కొలకుల పదల వీ । నులమెదళ్ళ
మూడునాలుగురెండు । మూడులై నెలవుల
నాల్గింటసుళ్లున్న । గల్గునొసల
అదిమూడునాల్గునై । పదమూడుచోట్లను
పండ్రెండు సుళ్ళలో । భాగములను
కరయుగంబునరెండు । గడలనివాడ
వస్తువములమూడు । వరుసనిట్లు
నెలవు లిరువదిన్ని । బెటవారనిలిచిన
సుళ్లుమున్నదియేడు । శుభతరములు

తత్ఫలంబులెల్ల । తర్వాత వివరింతు
కంపరాజ భూని । లింపరాజ. 18

సెలవులయందును కేశాంతములయందును వీనులయొక్క మొదళ్ళను.

క. చక్కగ సెలవులరెంటన్
జక్కనిరోమజములున్న । సైంధవరత్నం
బెక్కిన రాతుకులంబున
నెక్కాలమునిచ్చుచుండు । నిష్టార్థంబుల్. 19

సెలవులయందు రెండురోమజములు (సుళ్లు.) గలిగినటువంటి తురంగమును ఎక్కినరాతునకు సర్వకాల సర్వావస్థలయందును యిష్టార్థముల నిచ్చుచుండును.

క. శుక్తులు కేశాంతములను
వ్యక్తములై రెండుగల్గు । వాహమునెక్కన్
యుక్తిగలవాడు విజయా
సక్తుండౌపుత్రపౌత్ర । సంపదగలుగున్. 20

కేశాంతములందు సుళ్లుగలిగిన గుర్రము నెక్కినవాడువిజయుఁడై పుత్రపౌత్ర సంపదలతో తులతూగుచుండెను.

గీ. హయము రంధ్రోపరంధ్ర పర్యంతభూమి
గానవచ్చిన సుళ్లుమే । ఖలములంచు
అట్టిమేఖలినెక్కిన । యధిపుడెపుడు
మణివిభూషణ సౌభాగ్య । మహిమదనరు. 21

క. విలుతురు తురంగవేదులు
వెలయగ జెవిగూబలందు । వృషభావర్తాం
బులుగల్గుతురగ రత్నము
విలసన్మణి కుండలాది । విభవములిచ్చున్. 22

చెవి గూబలయందున్న సుళికి వృషభావర్తం బనిబరగును. వృషభావర్తంబుగల తురంగమును హయలక్షణ శాస్త్రసంపన్నులు అధిక విభవంబుల నిచ్చునని త్వరితముగ విలుతురు. (కొండురు)

సీ. నలుమూలలనుండు । నాల్గురోమజముల
బాతురంతికమను । సొంజ్ఞదనరి
ముమ్మూలలందుండు । మూడురోమజములు
త్రేతాగ్నినాగ వి । ఖ్యాతిదనరి
మొగిదంతిత్రైమొదలుండు । మూడురోమజములు
నిశ్రేణికాఖ్యమై । నివ్వటిల్లు
సంగడియై రోమ । జములు రెండుండును
యమళమనాముఖే । యంబుమించి
హయముఖాలంబుమీఁదనీ । యాకృతులసు
దానకంబుల నాల్గింట । దనరిమించి
సుళ్లు పండ్రెండు ఫలమును । సొరిదివినుము
రాజదేవేంద్రయోగా భళి । రాజకంప. 23

నాలుగుమూలలను నాలుగు సుళ్ళుండిన మొడల నద్దానిని బాతురంతికమందురు. త్రికోణాకారముగ మూడుమూలల సుళ్లుండిన త్రేతాగ్నియందురు. దొంతిని విధంబున మూడుసుళ్లుండిన నిశ్రేణిక యనంబరగును. రెండుసుళ్లు సమీపంబుననుండ యమళమందురు. ఈసుళ్ళన్నియు నొసటనుండవలయును వీనిఫలముల జెప్పుచున్నాను

క. నెన్నొసలజాతురంతిక
మున్నతురంగంబునుతము । హర్షోత్సవకరమై
సన్నుత ధరణీ రాజ్యస
మున్నత సౌఖ్యంబు లిచ్చు । నోభళకంపా !

నెక్కొనసలుమీద చాతురంతికమను సుడియున్న తురగమును మహోత్సవకరమైన ధరణీరాజ్యసుఖంబుల నిచ్చునని వివుతురు.

క. నిశ్రేణికఫాలంబున
విశ్రుతమగు ఘోటకంబు విశ్వములోనన్
ఆశ్రితవిలసత్పరిరంభో
గశ్రీయువిభవమిచ్చు గంధమహీశా. 25

నిశ్రేణికయను నామధేయముగలసుళ్ళు ఫాలభాగముపైనేయశ్వమునకుండునో అది విభవైశ్వర్యముల నొసగును.

మ. పదిలంబారగ సుళ్ళునాలుగు మరోభాగంబునం దిక్కులం
గదియంగాదగు రోచమానము సుముఖ్యస్థానమందుండెనా
నది శ్రీవక్షకి నామధేయమగు నాయశ్వంబుచేకూర్చు స
మ్మదలక్ష్మీశ్రయభోగభాగ్య విలసన్మాన్యప్రతాపోన్నతుల్. 26

ఉ. నాలుగురోమజాలముల నాలుగుమూలల పేరురంబుపై
బాలిచియున్న తేజిప్రమదంబున నెక్కెడి మానవేశ్వరుం
డాలములోన శత్రునిచయంబునణంచి తదీయ ల
క్ష్మీలలనా విశేషసుడి కేరిగనుణ్ మహీకంపభూవరా. 27

గీ. సోలినురముమీద శుక్తులుమూడుండు
సైంధవంబు సర్వసౌఖ్యదంబు
దానినెక్కి శత్రుసేనల జెండాడి
విభుడు మగుడిదివ్యవిభవుడగును. 28

ఉరముమీదను మూడుసుళ్లుగల తురగముసర్వసౌఖ్యములను ఇచ్చును. అట్టిగుర్రము నెక్కినవాడు శత్రుసేనల చెండాడి అధిక విభవముకలవాడగును.

క. అంగద నామముగల్గుతు
రంగము బాహువుల సుళ్లు ప్రఖ్యాతముగా

రంగ నవరత్నవిభవా
సంగతమొగి నిల్పసర్వ । సంపదలొసగున్. 29

అంగదనామము గలిగినటువంటి తురంగమునకు బాహువు లందు సుళ్లున్నయెడల నానావిధరత్న భూషణములను సర్వసంపద లొసగును.

క. దేవమణి దేవమణియును
మానవుని గళంబుజేరి । మహినుండుట న
ద్దేవమణి గల్గుతురగము
దేవేంద్రశ్రీయొసంగు । కృతిగరిం నృపా.

సీ. ప్రాసాద తోరణ । వరతిరింశ............
సరసిజ వేదికా । స్వస్తికములు
త్రితాగ్నియమళని । శ్రేణికా శ్రీవృక్ష
చాతురంతికగదా । చక్రములును
కలశాంగలశుక్తి । ఖర్జూరఖండేందు
వజ్రయూపాంకుశ । కల్పకములు
అశ్వత్థవర్ణ సూర్యార్ఘ్య పదాంబుజ
పాంచజన్యంబుల । పగిదినుండు
ధృవులురముపైనుండె నొసలిపై । నొండెగల్గు
తురగరత్నంబునెక్కిన । నరవరేణ్యు
డరులనిర్జించి తద్రాజ్య । మనుభవించు
రాజకులదీప యశోభిళ । రాజకంప. 31

సీ. కటికంక నాసికా । పుటగండకరమూల
జానుమాన్యాహను । స్కంధములను
ఆలీఢ సృక్కిండపాలాశ్రి తాండవ
కుక్షివాలస్థూల । క్రోడములను

భ్రూమధ్య కర్ణాగ్ర । ములరెండు రెంకుగా
కోడఘోణాసన । ప్రోథములను
కాకసగణనాభి । కకుదుత్తరోష్ఠపు
హ్రాసహాభి గండంబు । లోకటియొకటి
కుష్టికముల గళల । గూర్చల జంఘల
నాల్గుకాళ్ళసుళ్ళు..............సుళ్ళు
మొగిపిపానమొగున । మూగి డెబ్బదియూరు
గాని హయమునకు । మేనకంప. 32

క. చిత్తము సుడియాడరాచును
విత్తులసుడి పుత్రిహారము । వీపునసుడిదా
హృత్తమునకు సరిహారికిని
కుత్తుకసుడియున్న హయము । గొనరాచార్యుల్. 33

బీజములపై సుడియున్న తురగమును ఎక్కినరాజునకు పుత్రినాశనమగును. కుత్తుకమీద సుడియున్నను ఆతురగము కొనుటకు తురంగశాస్త్రజ్ఞులు సమ్మతింపరు.

చ. కటమున శంఖదేశముల । కన్నులకొల్కుల ప్రోథగండహ్రా
త్పుటములకక్షమూలముల । పుచ్ఛగుదంబుల క్రిందటన్ కకు
త్తటములకొక నాసనపదంబుల జంఘలజానుసంధులన్
బటవగుసుళ్లు వింశతియు । పైననుయారుమహాగ్రదోషముల్.

35. గ్రంథపాతమువలన యీపద్యము నశించినది. అక్షరములు స్ఫుటముగ కాన్పించుటలేదు. అచ్చుపుస్తకమందున్న పద్యమున తప్పులు మెండుగ గానంబడియెను. అందుచే విడువబడెను.

ఉ. కాకసమందు రోమజము । గల్గినవాజియు రాతునాజితో
నూకికళేబరంబు మరి । నూల్కొనియుండగ జేరియుగ్రపుం

గాకులు గ్రిద్దలుంగరచి । కండలు గుండెలు బీకిబీకిపే
రాకలితోడమిగ్రింగుభయ । దారవమొద్దిశ లెల్లనిండఁగన్. 36

చ. హరికకుదంబుపైసుడి మహాదురితంబుగ సర్వసౌఖ్య సం
హరమొనర్చు నట్టిసుడి । యశ్వముగట్టిన నింటఁబుట్టినన్
సురలకు విప్రముఖ్యులకు । జూడక ముట్టక యివ్వనొప్పలే
కరిరిపుఁడేలు రాజ్యమును । కప్పుడెపారఁగ తోటలొప్పఁగన్. 37

గుర్రమునకు మూపుర ముండవలసిన స్థలమున సుడియున్న యెడల నత్యాది మహాదురితములు గలిగించును. కావున అట్టి సుడి గల తురగమింటఁబుట్టినయెడల కంటిదానినిచూడక విప్రులకీయవలెను. లేదా శత్రురాజ్యమునకు దోలవలెను.

క. కక్షావర్త తురంగము
నక్షీణబలంబుగల్గు । నధిపతికైనన్
సాక్షేణమ్మ్ముల వానల
నక్షయముగ దట్టవు । నాభశాదిపకంపా. 38

కక్షావర్తమను సుడిగల తురంగము అధిపతికి నష్టము కలిగించును.

కం. ఎదనొప్ప నంపవానల
గదియుచు గురియించుననుచు । ఘనులెవ్వరుం
గదిసి కనువిచ్చిచూడరు
హృదయావర్తంబువాజి । నెక్కుఁదగునే. 39

హృదయావర్తమను సుడిగల తురగము నెక్కినచో శరపరంపరలజిక్కి ఓటమిజెందుదుమని జనులెవ్వరద్దానిని జూడరు.

ఉ. జానువునందు సుళ్లుగల । సైంధవముగా భాదినెక్కువాడు శో
కానల దగ్ధదేహుఁడగు । కాంక్షణచే యదిశాలనుండినన్

